


# వాడుకరి:Yedavallisreddy/Dr ganta gopal reddy

గంటా గోపాలరెడ్డి గారు 1932 ఫిబ్రవరి 14వ తేదీన జన్మించారు.

గడ్డిపల్లి, హుజూర్ నగర్ తాలూకా ఉమ్మడి నల్లగొండ జిల్లా తెలంగాణ రాష్ట్రం.వృత్తి Scientist (Agriculture ).

18 ఏప్రియల్ 2018 తేదీన మరణించారు .

**Yedavallisreddy/Dr ganta gopal reddy**



DR GANTA GOPAL REDDY

| గంటా గోపాలరెడ్డి | |
|---|---|
| జననం | గోపాల రెడ్డి<br>1932 ఫిబ్రవరి 14<br>గడ్డిపల్లి,ప్రస్తుత గరిడేపల్లి మండలం,పూర్వపు హుజూర్ నగర్ తాలూకా ఉమ్మడి నల్లగొండ జిల్లా తెలంగాణ రాష్ట్రం |
| వృత్తి | Scientist (Agriculture ) |
| ప్రసిద్ధి | Scientist (Agriculture ) |
| మతం | హిందూ |
| భార్య / భర్త | రత్నమాల |
| పిల్లలు | కుమారుడు అజిత్, కుమార్తెలు: మీరా, లక్ష్మి |
| తండ్రి | గంటా అనంతరెడ్డి |
| తల్లి | వెంకటనర్సమ్మ |

## బాల్యము – విద్యాభ్యాసము:

ఆంధ్రప్రదేశ్లోని నల్లగొండ జిల్లా తెలంగాణా ప్రాంతములో నున్నది. ఈ జిల్లాలోని హుజూర్ నగర్ తాలూకాలోని 'గడ్డిపల్లి' అను గ్రామమందలి శ్రీ గంటా అనంతరెడ్డి శ్రీమతి వెంకటనర్సమ్మ సంపన్నకుటుంబ దంపతులకు 1932 సం||లో, ఫిబ్రవరి 14వ తేదీన జన్మించారు గోపాలరెడ్డియని జన్మ నామకరణము చేసినారు . గడ్డిపల్లిలోని పాఠశాలలో1,2 తరగదులు చదివిన పిమ్మట, గ్రామీణ వాతావరణములో చదువుట కన్న, పట్టణ ప్రాంతములోని పాఠశాలలో చదివిన వారికి మంచి విద్య, చైతన్యపూరితమైన జ్ఞాన మందునని భావించిన తల్లిదండ్రులు మన గోపాలరెడ్డిని హైద్రాబాద్ నగరములో చదివించారు. 'వివేక వర్ధనీ విద్యాలయము'లో 10వ తరగతి వరకు చదివి బోర్డు పరీక్షలో ప్రథమ శ్రేణిలో ఉత్తీర్ణుడైనాడు.

## కళాశాల విద్య

గోపాలరెడ్డి రైతు కుటుంబమునకు చెందినవాడు. వ్యవసాయమందు ఆసక్తి గలవాడు. అందుకే అతనిలో వ్యవసాయశాస్త్రమునే చదువ వలయుననెడి పిపాస పెరిగినది. ఉత్తర భారతములోని సుప్రసిద్ధ అలహాబాద్ విశ్వవిద్యాలయమందలి అగ్రికల్చరల్ ఇన్స్టిట్యూట్ లో ప్రవేశమును సంపాదించి, 1948 నుండి 1952 సం|| వరకు శ్రద్ధగా అధ్యయనము గావించి, ఉన్నతశ్రేణిలో ఉత్తీర్ణతను సాధించెను. 1952 సం||లో B.Sc. (Agri) పట్టాను సాధించి, వ్యవసాయ శాఖలో ఉద్యోగమును పొందెను.

## ఉద్యోగం

**ప్రభుత్వ ఉద్యోగ బాధ్యతలు:** అవి స్వరాజ్యమవతరించిన తొలి రోజులు. హైద్రాబాద్ రాష్ట్రము నిజాం ప్రభువుల పాలన నుండి విముక్తమై భారత యూనియన్లో అంతర్భాగమైనది. దేశభక్తి పూరితులైన ప్రజలు పాలకులు యావద్భారత దేశమును, శీఘ్రగతిని, అభివృద్ధి సాధించుటలో ప్రథమ పంచవర్ష ప్రణాళికా కాలము 1952 నుండి 1957 వరకు పరచుటకు పంచవర్ష ప్రణాళికలను రచించిరి. దీనికి అనుబంధముగా దేశాభివృద్ధిని | ప్రప్రథమ ప్రాధాన్యతను "ఆహార కొరత నివారణ"గా చేపట్టి వ్యవసాయ విస్తరణకు పెద్దపీట వేసినారు.

**వ్యవసాయ విస్తరణాధికారి**:

అలహాబాద్ విశ్వవిద్యాలయము నుండి, వ్యవసాయ శాస్త్రములో B.Sc. విస్తరణాధికారి' (Agricultural Extension Officer) పదవిని, హార్టికల్చర్ డిపార్టు పట్టా పుచ్చుకొని వచ్చిన మన గోపాలరెడ్డికి, హైద్రాబాద్ ప్రభుత్వము వారు 'వ్యవసాయ మెంటులో 6 మాసములు నల్లగొండ జిల్లాలోనే కట్టబెట్టినారు. 1952 సం|| నుండి 1958 వరకు అత్యున్నత ప్రమాణములతో, అందించినవారి సేవలకు ప్రతిగా హైద్రాబాద్ ప్రభుత్వము మెరిట్ సర్టిఫికేటు' (Merit Certificate) ను బహూకరించి, వారిపై ప్రశంసల జల్లు కురిపించినది.నల్లగొండ జిల్లా 'వ్యవసాయ విస్తరణాధికారి' గా అత్యుత్తమ సేవలను అందించి, వ్యవసాయ రంగమును, ప్రగతిపథములో నడిపించినందుకు, 1954-55 మరియు 1955-56 సం||లలో ప్రభుత్వము వారు గోపాలరెడ్డికి "నగదు పురస్కారము"ను యిచ్చి సత్కరించినారు.

**విశిష్టమైన వారి సేవా నిరతి :**

గోపాలరెడ్డి 'వ్యవసాయ విస్తరణాధికారి'గా నల్లగొండ జిల్లాలో, వ్యవసాయ రంగ అభివృద్ధికై ఒక వినూత్నమైన విప్లవమునే సృష్టించి నారనుటకు, వారు చేపట్టిన దిగువ కార్యక్రమాలే తార్కాణముగా నిలుచును. 1. ఆధునిక వ్యవసాయం, సాంకేతిక శాస్త్ర పద్ధతిలో సాగాలని, రైతాంగమునకు శిక్షణ యిచ్చుట. 2. రైతులు వ్యవసాయ క్షేత్రాలందు, ప్రయోగాత్మక వ్యవసాయ ప్రదర్శన నిర్వహించి చూపుట. 3. నూతన వ్యవసాయ పద్ధతులను, రైతుల క్షేత్రాలలో, శిక్షణా పూర్వకంగా నిర్వహించి చూపుట. 4. వ్యవసాయ పంటల మెరుగైన దిగుబడికి అవసరమగు ఎరువులను, మందులను, సకాలములో సరఫరా చేయుట. 5. వ్యవసాయ వార్తలను రైతులకు చేరవేయుట. వ్యవసాయ రంగ అభివృద్ధిని మరియు రైతాంగము యొక్క ప్రయోజనమును దృష్టియందుంచుకొని, పై కార్యక్రమాలను వారు చిత్తశుద్ధితో నిర్వహించుటయే గాక వారి సిబ్బందికి కూడా, రైతుబాంధవులకు అవసరమగు సహాయ సహకారములను, సకాలములో అందించుటకు పురమాయించుటచే, రైతులకు పంటదిగుబడి పెరిగి ప్రయోజనము సమకూరినది. గోపాలరెడ్డి పనికి కూడా గుర్తింపు దక్కినది. ప్రభుత్వ దృష్టి నాకర్షించిన వారి కార్యసరళి రాష్ట్రమందు ఆదర్శప్రాయమై నిలచినది.

## అమెరికాలో ఉన్నత విద్యనార్జించుట:

శ్రీ గోపాలరెడ్డి యందు ఉరకలెత్తిన ఉత్సాహము యింకను పై చదువులు పూర్తి చేసి, పరిశోధనా వ్యాసంగమును కూడా చేపట్టవలయునన్న ఆకాంక్ష పెరిగినది. అవసరానికి అందివచ్చిన అవకాశమన్నట్లు, అమెరికా ప్రభుత్వము వారు మన రెడ్డి గారికి, 1958లో ఉన్నత చదువులకు Full Bright Scholarship ను ప్రధాన మొనరించుట జర్గినది. దానితో వారు అమెరికాలోని, మిన్నెసోటా విశ్వవిద్యాలయములో ప్రవేశాన్ని పొంది, 1958- 1960 సం||లో భూమికి సంబంధించిన శాస్త్రమందు, M.Sc. (Soil Science) (పరిశోధనా సహాయకులుగా) పట్టా పొందినారు. ఆ తర్వాత అదే క్రమంలో గోపాలరెడ్డి గారికి East West Centre Fellowship పై, అమెరికాలోని 'హోనోలూలు' రాష్ట్రమందలి "హా వాయిల్ విశ్వవిద్యాలయము" నందు 1960 1964 సంవత్సరముల మధ్యకాలములో వ్యవసాయ శాస్త్రమందు పరిశోధన చేయుటకు ప్రవేశము లభించినది. భూమికి చెందిన శాస్త్రము (Soil Science) నందు పరిశోధనా వ్యాసంగమును విజయవంతంగా నిర్వహించి, Ph.D. పట్టాతో సత్కరింపబడి, విజయ దర్పముతో స్వదేశానికి తిరిగి వచ్చిరి.

## భారత దేశమునకు తిరిగి వచ్చుట:

(డా|| గోపాలరెడ్డి గారి మాటలలో) "1964 సం|| ఏప్రిల్ 4వ తేదీన అమెరికా నుండి తిరిగి వచ్చి హైద్రాబాదులో దిగినాను. 24-4-1964న దర్శనదినము నాడు ఆశ్రమమునకు చేరుకొని శ్రీమాతను సందర్శించి, ఆ జగన్మాత ఆశీస్సులు పొందినాను. అంతకు ముందే నిర్ణయించిన విధముగా మా ఏకైక కుమారుడు చిరంజీవి అజిత్రెడ్డిని ఆశ్రమ పాఠశాల (International Centre of Education) లో 4వ తరగతిలో చేర్పించినాను. అతను అక్కడే చదివి, అనంతరము శ్రీమాత అనుమతితో శ్రీ అరవిందాశ్రమ సభ్యుడుగా చేరిపోయినాడు. ఇది మా అదృష్టము మరియు గర్వకారణముగా భావించుచున్నాము. శ్రీమాత ఒడిలో వానికి ఆశ్రయము దొరికినట్లే, ఆమాత యొక్క సంపూర్ణ అనుగ్రహము మాపై కూడా ప్రసరించినది. అప్పటి నుండి ప్రతి దర్శనమునకు మేము కుటుంబసభ్యులము, ఆశ్రమానికి అమ్మ అనుగ్రహ ఆశీస్సులు పొందుటకు వెళ్ళుచున్నాము. మేము ఆశ్రమానికి వెళ్లిన ప్రతిమారు, ఆశ్రమ వ్యవసాయ క్షేత్రము (Ashram Lake Farm) ను సందర్శించి, అచటి అభివృద్ధిని చూచుట పరిపాటి అయినది. ఆ క్షేత్రము సువిశాల మైనది. 300 ఎకరములలో విస్తరించి యున్నది అందులో కొబ్బరి తోట, హార్టీ కల్చర్ వంటలు, అనగా ఫలములు, కూరగాయల, పాలుత్పత్తి తదితరమలైన పంటలను శ్రీ ద్యుమన్ గారి ఆజమాయిషీలో పండించుచున్నారు. క్షేత్రము యొక్క నిర్వహణ చాలా చక్కగా నున్నది. శ్రీ డ్యుమన్ గారు దక్షిణ ఆఫ్రికానుండి అరుదెంచినవారు. శ్రీ అరవిందుల అంతరంగిక శిష్యులు, శ్రీ మాత అనుంగు బిడ్డ. చాలా మారులు నేనాక్షేత్రమును సందర్శించటతో నాకు వారు మిత్రులైనారు. ఆ వ్యవసాయ క్షేత్రమునకు అనుసంధానముగా అక్కడొక వ్యవసాయ వృత్తి విద్యా శిక్షణా సంస్థ' (Vocational Agricultural Institution) నేర్పాటు చేసిన బాగుండునని వారితో సూచించగా, ఆ విషయమును శ్రీమాతకు వ్రాసి వారి ఆశీస్సులను పొందవలసినదిగా వారు నాకు సంలహా యిచ్చినారు." ఆ విధమైన సంస్థ ఆశ్రమంలో లేదు. ముందు ముందు తానచటికి వచ్చినపుడు నిర్వహించ వచ్చునను దృష్టితో నుండిరి. కుటుంబమంతా ఆశ్రమానికి తరలి రావాలనే సంకల్పము వారిలో బలముగానే యుండెను. అదే విషయమును తమ భార్యతో కూడా చర్చించి, భవిష్యత్తులో తమ బిడ్డలకిద్దరికి సమగ్ర విద్యలభించగలదని తలచినారు. మొదట ఆమె సంశయించినది. కాని తర్వాత తన అంగీకారమును తెల్పినది. శ్రీ అరవిందాశ్రమం సందర్శించిన నాటి నుండి శ్రీమాత ప్రభావము గోపాల రెడ్డిపై నిరంతర ముండుటచే, ఆయనలో ఆశ్రమంలో చేరిపోవాలనెడి బలమైన ఆకాంక్ష పని చేయుచునే యున్నది. ఇదే విషయమును పేర్కొనుచు ఆయన శ్రీ మాతకు నౌక లేఖ వ్రాసి తన ఆకాంక్షను తెలిపెను. సమాధానముగా శ్రీమాత నుండి ఆశ్రమంలో వుండుటకు అనుమతి లభించినది, కాని ఒక షరతు విధించినది. అదేమనగా "నీ జన్మస్థలముతో సంబంధమును త్రెంచుకొని ఆశ్రమంలో చేరవచ్చునని", తన లేఖపైననే వ్రాసి తన ఆశీస్సులనందించినది. ఆశ్రమంలో చేరుటకు అనుమతి లభించినందుకు ఆనందము, జన్మస్థలముతో సంబంధమును త్రెంచివేయుట అసాధ్యమగుట దుఃఖ దాయకము. ఇప్పుడిక చేయాల్సిన కర్తవ్యము బోధపడక, తన తాతల నుండి సంక్రమించిన భూములను విక్రయించుటకే నిశ్చయించి ప్రయత్నమారంభించెను. కాని ఎవరు ఇంత పెద్ద ఆస్తిని కొనుటకు ముందుకు రాలేదు. ఆ గ్రామములో ఆయనకన్న అధిక సంన్నులు లేరు. మిగిలిన వారందరు మధ్యతరగతి, పేద వర్గమునకు చెందినవారే యగుట వలన, తనకు నిరాశే ఎదురైనది. ఎన్నివిధములుగా ఆలోచించినా బోధపడలేదు. విఫల మనోరథుడై చేయునది లేక వగచుచు కాలము గడుపుచుండెను.. ఆయనలో క్రమక్రమముగా ఆశ్రమము పోవలయునన్న ఆలోచన అడుగంటినది.

## ఆంధ్రప్రదేశ్ వ్యవసాయ విశ్వవిద్యాలయంలో ప్రవేశం :

గోపాలరెడ్డి గారు అమెరికా నుండి తిరిగివచ్చిన తర్వాత ఆంధ్రప్రదేశ్లో 1964లో నూతనంగా వెలసిన వ్యవసాయం విశ్వవిద్యాలయంలో "సైంటిఫిక్ పూల్ ఆఫీసర్" (Scientific pool Officer) గా తాత్కాలిక పదవిలో చేరినాడు. అపుడాయన CSIR ఫెలోషిప్ వున్నాడు. ఆరు నెలలకే అసోసియేట్ ప్రొఫెసర్ పదవిని Soil Science & Agricultural Chemstry డిపార్టుమెంటులో పదవిని యిచ్చినారు. ఆనాటి నుండి అదే విశ్వవిద్యాలయములో April 1969 వరకు పని చేసినారు. వ్యవసాయ విశ్వవిద్యాలయ అధ్యాపక వృత్తి - వృత్తిలో ప్రవేశము : డా|| గోపాలరెడ్డి గారు వ్యవసాయ శాస్త్రములో అత్యున్నత శిఖరములకు అధిరోహించి, అమెరికా నుండి తిరిగి వచ్చిన పిదప, అభివృద్ధి చెందిన అమెరికా దేశములో తాను పొందిన ఉన్నత వ్యవసాయ విద్యాఫలములను, మన దేశీయ విద్యార్థులలో పంచుటకు సంకల్పించుకొన్నారు. హైద్రాబాదులోని వ్యవసాయ విశ్వ విద్యాలయము, వారిని ఆహ్వానించి అధ్యాపక పదవితో సన్మానించినది. ఆంధ్రప్రదేశ్ వ్యవసాయ విశ్వవిద్యాలయములో అసోసియేట్ ప్రొఫెసర్గా పదవీ బాధ్యతలను చేపట్టి, వ్యవసాయ విద్యకు చెందిన అకడమిక్ ప్లాన్ను సంసిద్ధ పరచుటకై తీవ్రమైన కృషి చేసినారు.

## వ్యవసాయ విశ్వవిద్యాలయములో నిర్వహించిన కార్యములు :

1. వ్యవసాయ విద్యలో గ్రాడ్యుయేట్ & పోస్టు గ్రాడ్యుయేట్ తరగతులకు 'అగ్రానమీ' (Agronomy) నందు మరియు భూమికి చెందిన శాస్త్రము (Soil Science) నందు పాఠములను బోధించినారు. 2. విశ్వవిద్యాలయములోని అకడమిక్ కోర్సులకు చెందిన పాఠ్య ప్రణాళికను, సంసిద్ధ పరచుటలో తీవ్ర కృషి చేసినారు. 3. పరిశోధనా మెథడాలోజి రూపొందించుట, భూమిని పునరుద్ధరించుట, దానిని సారవంతము చేయుట, నీటి సంరక్షణ మున్నగు రంగాలందు మెరుగైన ఫలితాలను రాబట్టుటకు కృషి చేసినారు. 4. గురు పోస్టు గ్రాడ్యుయేట్ విద్యార్థులకు, సహాయకులుగా యుండి, వారికి పరిశోధనా రంగమున ఉత్తమ శిక్షణను అందించినారు. 5. ఆం. ప్ర. వ్యవసాయ విశ్వవిద్యాలయములోని 'అగ్రికల్చర్ ఫ్యాకల్టీ బోర్డు మెంబర్' గాను, మరియు వ్యవసాయ విద్యాలయము యొక్క 'అకడమిక్ కౌన్సిల్ మెంబర్' గాను చురుకైన పాత్ర పోషించినారు. 6. విశ్వవిద్యాలయ గ్రాడ్యుయేట్ మరియు పోస్టు గ్రాడ్యుయేట్ స్థాయి కోర్సులకు 'అకడమిక్ ప్లానింగ్'ను సంసిద్ధ పరచినారు. 7. సాగు చేయు భూక్షేత్రముల అభివృద్ధి మరియు వవ్యవసాయ విశ్వవిద్యాలయ విస్తరణ కార్యకలాపాల నిర్వహణను చేపట్టినారు. 8. వివిధ అంతర - వ్యవసాయ విశ్వవిద్యాలయ సెమినార్లలోను వర్క్ షాపుల్లోను పాల్గొని అకడమిక్ ప్లానింగ్ పరిశోధనా రంగమునకు చెందిన పద్ధతులను మెరుగు పరచుట, గ్రామీణ వ్యవసాయాభివృద్ధి వంటి అంశము లందు నిశితమైన తమ అభిప్రాయాలను తెలిపినారు.

## గడ్డిపల్లిలో లిప్టు ఇరిగేషన్ యేర్పడుటకు ప్రధాన కారణములు:

గడ్డిపల్లి గ్రామములో, లిఫ్టు ఇరిగేషన్ ఉద్యమము ప్రారంభమగుటకు 4 ప్రధాన సంఘటనలు చోటు చేసికొన్నవి.

1. శ్రీ గోపాలరెడ్డి గారి చిన్నాన్న గారు ఆయనను స్వార్థపరుడనుట. 2. లింగాల గ్రామమునకు చెందిన శ్రీ మధుసూదన రెడ్డి గారు తమ గ్రామాల వారందరకు లిఫ్టు ఇరిగేషన్ సౌకర్యమును కలుగు చేయుటకు ప్రయత్నించ వలసినదిగా కోరుట. 3. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము వారి ఔదార్యము, 'నాగార్జున సాగరము' ఎడమ కాలువ నుండి లిఫ్టు ద్వారా నీరు తోడుకొని, వ్యవసాయమునకు అనుమతించి, జీవో విడుదల చేయుట. 4. ఆంధ్రప్రదేశ్ వ్యవసాయ విశ్వవిద్యాలయములో పని చేయు ఆచార్యులందరకు లిఫ్టు ఇరిగేషన్ విషయములలో శిక్షణ నిచ్చు - కమ్యూనిటి లిఫ్టు ఇరిగేషన్ సొసైటీలకు, బ్యాంకుల నుండి ఋణ సదుపాయము కల్పించుటకు అంగీకరించుట. ఈ నాలుగు సంఘటనలు శ్రీ గోపాలరెడ్డి గారిని లిఫ్టు ఇరిగేషన్ దిశగా నడిపించి, ఆ కార్యసాధనకు ఊతము నిచ్చినవి. ఈ విధముగా ఆ మహత్కార్యానికి అంకురార్పణ జరిగినది. వివరములలోకి వెలదాం !

## గడ్డిపల్లిలో లిఫ్టు ఏర్పడుటకు ప్రధాన సంఘటన:

శ్రీ గోపాలరెడ్డి గారి హైద్రాబాదులోని వ్యవసాయ విశ్వవిద్యాలయంలో ఉద్యోగం చేస్తున్నపుడు, వారమున కొకమారు గడ్డిపల్లి వచ్చెడివారు. ఒక పర్యాయము తాను గ్రామానికి వచ్చినపడు మిత్రులను, బంధువులందరిని కల్సికొనెడివారు. ఎక్కువగా వారి చిన్నాన్న గారైన గంటా చిన అనంతరెడ్డి గారితో కాలక్షేపము చేయుటలో తమ కుటుంబానికి చెందిన అనేక విషయాలను తెల్సుకొనెడివారు. వారితో మాటల సందర్భమున ఒకమారు “గోపాలరెడ్డీ! నీవు చాలా అదృష్టవంతుడవు. పెద్ద పెద్ద చదువులు చదివినావు. పెద్ద ఉద్యోగము చేయుచున్నావు. నీవు మన కుటుంబమ నకు గర్వకారణము. నియంత చదువులు మన కుటుంబములో చదివిన వారెవరున్నారు? నీవే మన కులదీపకుడవు. గంటా వారి వంశకీర్తిని విస్తరింప చేసినావు. నీవు ధన్యుడవు. చల్లగా వర్ధిల్లు"మని దీవించి మరొక్కమాట కూడ అనెను. "వారీ! ఎంతైనా నీవు స్వార్ధ పరుడివేరా !" మాటల సందర్భములో వారి నోటి నుండి దొర్లినవి. అంతే కాని పనికట్టుకొని అతనిని నిందించాలని గాని, కోపముతోగాని అనిన మాటలు కావవి. వారు ఎల్లపుడు అతి చనువుగాను హాస్యరస భరితముగాను మాట్లాడెదరు. తన చుట్టూ వున్న వారి నందరిని సదా నవ్విస్తుంటారు. ఈ మాటలు గోపాలరెడ్డిలో కలకలమురేపినవి. ఇట్లించుకన్నాడబ్బా! అని ఆలోచనలో పడిన ఆయన “ఎందుకు చిన్నాన్నా మీరావిధముగా అంటిరేమి ?" అని ప్రశ్నించాడు. అప్పుడు “గత మూడు సంవత్సరాలుగా మన ప్రాంతములో వర్షములు లేవు, ఘోరమైన కరువు యేర్పడి యున్నది. పంటలు లేవు. భూగర్భ జలములడుగంటినవి. బీద బిక్కి జనము అన్నమో రామచంద్రా! యని అలమటించుచున్నారు. దారుణమన ఈ పరిస్థితిలో కూడా నీ

బావిలో జలమున్నది. 10 ఎకరములలో పంటలు పండు చున్నవి. పైగా నీవు పట్నంలో పెద్ద ఉద్యోగంలో నున్నావు. పైసలు కూడా పుష్కలము. ఇన్ని విధములుగా నీ పరిస్థితి సురక్షితము. మా బ్రతుకులకే ముప్పు యేర్పడినది. కాదా ! నీవు ఎన్నడైనా మా గురించి ఆలోచించినావా? చదువుల్లో పెద్ద చదువు నీది, పైగా పట్నంలోని పెద్దలందరూ నీకెరుక. కావున మాకేదైనా దారి చూపంచ వచ్చుకదా ! నీవు మాగురించి ఎప్పుడైనా ఆలోచించినావా? నేనన్నది యదార్థము కాదా !" అని వారి చిన్నాన్న గారు యిదంతా వల్లించారు. ఈ మాటలు మన గోపాలరెడ్డిలో ఆలోచనలను రేకెత్తించినవి. చిన్నాన్న గారి మాటల్లో యదార్థము లేదని కాదు. కాని ఆ పెద్దాయన ఈ విధముగా ఎప్పుడు అనలేదు కదా ! అని వుంటే ఆలోచించేవాడను కదా ! అని తన మదిలోనే అనుకొని, యిప్పటికైనా మించిపోలేదు. రైతాంగమంతా ఐక్యంగా ఒక్కమాటపై వుంటే అందరి బ్రతుకులు బాగుపరచుకొనవచ్చుననవి తన చిన్నాన్నతో అనెనె. అందుకు వారు అదెట్లు సాధ్యపడునని ప్రశ్నించారు. "దేశమంతటా కరువు ఏర్పడినది. దీనిని అధిగమించుటకు ప్రభుత్వము వారు - రైతులు సామూహికంగా లిఫ్టు ఇరిగేషన్ పద్ధతిలో నాగార్జునసారగ్ ఎడమ కాలువ (లాల ్బ హదూర్) నుండి నీరు తోడుకొని వ్యవసాయము చేసికొనుటకు మనకు అవకాశమును కల్పించినారు. ఆ మేరకు ఒక జీవోను విడుదల చేసినది. కలిసి కట్టుగా ప్రయత్నించినపుడది సాధ్యము కాగలదు." అని మన శాస్త్రవేత్త తన చిన్నాన్నకు విన్నవించెను. సహజముగా సరళ స్వభావం, ఉత్సాహవంతమైన నైజము గల వారి చిన్నాన్నకు అమితానందము కల్గినది. మరొక ఆలోచన లేకుండా యిర్వురు కల్సి ఈ బృహత్తర కార్యాన్ని సాధించుటకు నిర్ణయించుకున్నారు. తాను పట్నంలోను, అధికార గణంతోను సంప్రదింపులు జరుపుటకు పైరవీ చేయుటకు పూనుకొనెద ననగా, ఆ పెద్దాయన గ్రామ రైతులకు యీ విషయాన్ని తెలిపి, వారినే గాక చుట్టూరా వున్న పల్లెల లోని జనాన్ని కూడా నిద్రలేపి సమాయత్త పరచుటకు సిద్ధమైనారు. అదే ఊపులో గ్రామ గ్రామానికి వెళ్లి రైతులకు నీటి విషయము తెలిపి, మనం యిక పంటలు పండించుకొనుటకు మార్గము యేర్పడినట్లు రైతాంగమునకు తెలియబరచగా వారు వేసే అనేక ప్రశ్నలకు సరియైన సమాధానములిచ్చెను. ఎవరు చేయుదురు ఈ పనినని వారు ప్రశ్నించినపుడు, నేను మరియు మా అన్నకుమారుడు మేమిద్దరము కల్సి 1 + 1 = 11 అని సమాధానము తెలిపి, అందరిని సమాయత్త పరచుపనిని తన భుజానికెత్తుకొనెను. ఈ విధమైన తన చిన్నాన్న ప్రయత్నము తనలో విశ్వాసమును పెంచినది. కార్యసాధన జరుగ గలదని విశ్వాసము కుదిరినది. తన చిన్నా గారిని రైతులను ఆయత్తపరచుటకు తెలిపి తాను నిర్వహించాల్సిన కార్యములను సాధించు దిశలో పట్నం వెళ్లి తన ప్రయత్నములందు మునిగిపోయెను.

## లిఫ్టు ఏర్పడుటకు రెండవ సంఘటన-

శ్రీ మధుసూదన్ రెడ్డి, లింగాల గారి ప్రోత్సాహము : గడ్డిపల్లి గ్రామమునకు సమీపములోనే గల మరో చిన్న గ్రామము "లింగాల”. అచటి పెద్ద రైతు శ్రీ మధుసూదన్ రెడ్డి గారు. మన రెడ్డిగారికి అత్యంత సన్నిహితుడు, బంధువు కూడాను. గోపాలరెడ్డి గారితో వారు కల్సినపుడు, “నీవు వ్యవసాయ శాస్త్ర వేత్తవు, ఆ డిపార్టుమెంటు వారితో నీకు సంబంధాలున్నవి. నీవు యే విధముగానైనా ప్రయత్నించి మన గ్రామాలకు లిఫ్టు ఇరిగేషన్ సౌకర్యము కల్పించాలి" అని కోరెడివారు. వారి చిన్నాన్న గారు అనుటకు ముందు నుండే అడుగుచుండెను. ప్రయత్నించెదమని బదులు చెప్పుటతోనే గడచిపోయేది. వీరి యిర్వురి ఆలోచన బీజప్రాయములోనే ఆగి పోయినది:

## లిఫ్టు ఏర్పడుటకు మూడవ సంఘటన-ప్రభుత్వ అనుమతి జీవో విడుదల :

ఆనాడు మనరాష్ట్రములో యేర్పడిన కరువు పరిస్థితులకు ప్రజలు దుర్భర స్థితులందు చిక్కుకొని తల్లడించు చుండిరి. వర్షములు లేవు. పంటలు లేవు. పశుగ్రాసమునకు కూడా కొరత యేర్పడినది. మనుష్యులతో పాటు వారినాశ్రయించు కొని యున్న మూగ జీవాలకు కూడా కష్టమే సంభవించినది. ఇట్టి తరి మన ప్రభుత్వము వారు ఔదార్యముతో, నాగార్జునసాగరము యొక్క ప్రధాన కాలువ (లాల్ బహదూర్ కాలువ)కు యిరుప్రక్కన గల బీడు భూములను కమ్యూనిటి లిఫ్టు పద్ధతిలో ఇరిగేషన్ కొనసాగించుకొనుటకు అనుమతించి, జీవో విడుదల చేసినది. ప్రభుత్వము అన్ని విధములుగా సహకరించుటకును, బ్యాంకులు కావలసిన ధనమును ఋణముగా యిచ్చుటకు సౌకర్యము కల్పించబడినది. రైతులు సిద్ధమైతే చాలు. వీని నన్నిటిని సమన్వయ పరచు నాయకత్వం కూడా ముఖ్యమైది.

**లిఫ్టు ఏర్పడుటకు నాల్గవ సంఘటన - వ్యవసాయ శాస్త్రవేత్తలకు బ్యాంకు అందించిన శిక్షణ :**

బ్యాంకు అధికారులు తమ వాణిజ్యమును విస్తరించుట కొరకు, ప్రభుత్వము వారు లిఫ్టు ఇరిగేషన్ సౌకర్యము కల్పించిన దృష్ట్యా, ఒక యోజనను రూపొందించు కొని, వ్యవసాయశాస్త్రవేత్తకు, అధికారులకు తాము కల్పించే ఋణసౌకర్యమునకు విధించిన నియమములు, షరతుల వివరములను వారికి తెలియపరచి, తగు విధముగా రైతు కమ్యూనిటిని సిద్ధపరచుటకు శిక్షణ యిచ్చినారు. వ్యవసాయ విశ్వవిద్యాలయము లోని ఆచార్యలందరకు ఈ శిక్షణ యిచ్చుట వలన, ఆ వివరములను మన రెడ్డి గారు మొదటనే తెల్సియుండుట జరిగినది. ఆ విధముగా లిఫ్ట యేర్పాటుకై అనుకూలించినది. ఈ విధముగా అన్ని సంఘటనలను పరిశీలించినపుడు, చిన్నాన్న గారి 'విమర్శ' నుండి లింగాల మధుసూదన్ రెడ్డి గారి ప్రోత్సాహము', ప్రభుత్వ 'ఔదార్యము', బ్యాంకు వారందించిన 'శిక్షణ' - యివన్నీ మన కథానాయకుని ముందు నుండే సంసిద్ధపరచుటకు తారసిల్లినట్లు అర్థము కాగలదు. దైవలీలను, దైవ సంకల్పమును ఎవరెరుగ గలరు. ఈ మహత్తరమైన కార్యసాఫల్యతకే వారుద్దేశించబడినట్లు ధృవ పడుచున్నది. మహనీయుల వల్లనే కదా మహత్కార్యములు సిద్ధించునది !

**గడ్డిపల్లిలో గంటా అనంతరెడ్డి గారి ప్రయత్నములు :**

గడ్డిపల్లి లిఫ్టు ఇరిగేషన్ పనిని మన గోపాలరెడ్డి గారు మరియు వారి చిన్నాన్న అనంతరెడ్డి గారు భుజానికెత్తుకొని ఎవరి ప్రయత్నములో వారు నిమగ్నమైనట్లు చెప్పు కున్నాము. వారి వారి పనులలో జరిగిన పురోభివృద్ధిని సమీక్షించి ముందేగుదాము. ఉత్సాహవంతుడైన వారి చిన్నాన్న గారు ఊరంతా తిరిగి ప్రతిరైతును కల్సి మనకు నాగార్జున సాగరజలము రానున్నది. అందరికి సుఖ సంతోషములు, అతి త్వరలో చేకూరగలవు. మేము యిర్వురము అనగా, మా గోపాలరెడ్డి మరియు నేను కల్సి ప్రయత్నించుచున్నాము. గ్రామములోని రైతులందరి మధ్య ఈ విషయానికి సంబంధించిన చర్చలు తీవ్రమైనవి. గడ్డిపల్లిలోనే కాదు పరిసర గ్రామాలందు కూడా ఈ చర్చలు ముమ్మరమైనవి. నీరు వచ్చుట సాధ్యమా ? అసాధ్యమా ? అని ఎవరిడిగినా మన రెడ్డి ఏమి చెప్పకుండా తనపని తాను చేసుకపోవుచున్నాడు. రైతుల మధ్య నీటి సమస్య మీదనే చర్చలు జరిగినవి. రైతులందరిని పిలిచి ఈ విషయము పై మీటింగ పెట్టుటకు ముందే గోపాలరెడ్డి గారు తన ఉద్యోగమునకు సెలవు పెట్టి సమాచార సేకరణ కుపక్రమించెను. మొదటి పనిగా జీవో కాపీని సంపాదించి, అందులో సాధ్యాసాధ్యాలను పరిశీలించుట, రెండవ పనిగా వొల్టాస్ కంపెనీ వారితో, తమకు భారీ తరహా లిఫ్టు పరికరములు అవసరమును తెల్పుట. గడ్డివల్లి మరియు పరిసర గ్రామాలకు చెందిన 6,000 ఎకరములకు పారకమునకు తగిన ఇంజన్లను సప్లై చేయుటకు కోరుట జరిగినది. ఆ తర్వాత ఇండియన్ హ్యూం పైపుల కంపెనీ వారిని కల్సి వారు ఏమేరకు పైపుల నిర్మాణము చేయగలరో తెల్సుకొని మనకు అవసరమగు సైజులను వారికి తెలియబరచుట జరిగినది. ఆ తర్వాత అతి ప్రధానమైన పని ఆర్థిక వసతిని సమకూర్చుట. అందుకొరకు స్టేట్ బ్యాంక్ ఆఫ్ హైద్రాబాదు ఆఫీసుకు వెడలి జనరల్ మేనేజర్ (ఆపరేషన్స్) గారిని కల్సినారు. వారు మన గోపాలరెడ్డి గారికి పరిచయమున్నవారే. వారు వ్యవసాయ విశ్వవిద్యాలయములో నున్నపుడు బ్యాంకు వారిచ్చిన శిక్షణ సమయములో పరిచయమైన వారగుట వలన వారితో చనువు ఏర్పడినది. ఈ ప్రాజెక్టు పనిలో ముందుకు సాగవచ్చునా యని అడుగగా పోవచ్చునని తెల్పినారు. గోపాలరెడ్డి గారు ప్రభుత్వము నుండి జీవో కాపీని సంపాదించి వోల్టాస్ కంపెనీ వారిని, ఇండియన్ హ్యూం పైపుల కంపెనీ వారిని ఆపైన స్టేటుబ్యాంక్ ఆఫ్ హైద్రాబాద్ వారితో సంప్రదించి, అన్ని సంస్థల నుండి అనుకూల స్పందన రాగా, ప్రాజెక్టు పని ఆశావహంగానే అనిపించినది. అంతరంగంలో కార్యసాధన తథ్యమని తేలిపోయినది. ఇక మిగిలిన పని జగన్మాత ఆశీస్సులు.

## జగన్మాత అనుగ్రహమునకు అభ్యర్థన:

లోగా తాను ఆశ్రమంలో స్థిరపడుటకు సంకల్పించి శ్రీమాత నర్థించెను.

| Yedavallisreddy/Dr ganta gopal reddy |
| --- |
| [[Image:|220px| ]] |

గడ్డిపల్లిలోతో సంబంధము త్రెంచుకొని రావచ్చునని శ్రీమాత అనుమతించినది. కాని అది సాధ్యపడలేదు. మరి యిప్పుడేది నిర్ణయము ? తనకు తాను తేల్చుకోలేని స్థితి. మరొక మారు శ్రీమాతనే అర్థించి, దైవేచ్ఛ ననుసరించి, తనకేది సురక్షితమైన మార్గమో తెలుపవలసినదిగా వేడుకొనెను. అందుకు శ్రీమాత "You work at Gaddipally" అని వ్రాసి తన ఆశీస్సులతో పంపించినది. మన గోపాలరెడ్డి గారు ఆ 'ఆశీస్సులను' వట్టి మాటలుగానో లిఖింపబడిన అక్షరాలు గానో చూడక, దాని వెనక ఆధ్యాత్మిక శక్తి, బలము, విజ్ఞానము, సత్యము, జ్ఞానము ప్రేమ యివన్ని వున్నట్లు భావించినాడు. ఇవన్నీ ఆయనలో అజేయమైన విశ్వాసమును, ధైర్యమును బలమును ఆయనకు సంక్రమింప జేసినవి. కార్యసాధనలో వారికెట్టి విఘ్నములు, అవరోధములు యిక్కట్టులు, శత్రుత్వములు, సహాయ నిరాకరణ లాంటి కష్టములు ఏర్పడవు

అన్నట్టి దృఢ నిశ్చయము కల్గినది. "శ్రీమాత ప్రసాదించిన వరములు నాకు రక్షణను కల్పించి, మార్గదర్శనము చేయగలవను విశ్వాసము కలదు కావుననే నా సేవలను గడ్డిపల్లి ప్రాజెక్టునకు - అనగా 6 గ్రామాలకు 6000 ఎకరాల భూమి సాగునకు వినియోగించ దలచినాను" అని అనెను. "ఈ ప్రాజెక్టు పనిని నేను దైవకార్యముగా భావించి, నన్ను నేను ఆ దైవము యొక్క పనిముట్టుగా భావించి, మహనీయమైన ఈ "కృషి యజ్ఞము" నకు నేను సర్వభావేన అంకిత మగుచున్నాను" అని స్పష్టము చేసెను. రైతాంగము మదిలో ఆనందోత్సాహములు నిండెను.


శ్రీ మాతృ కృప గడ్డిపల్లి అభ్యుదయము

## ప్రశంసలు

S R Jindal FOUNDATION Awardees 2011 https://archive.org/details/dr.-ghanta-gopal-reddy - Dr. Ghanta Gopal Reddy

SITARAM JINDAL FOUNDATION https://archive.org/details/dr.-ghanta-gopal-reddy-award-video-clip

Honours 27 Awardees for exemplary contributions to the Society https://archive.org/details/awards-received-by-dr.-ganta-gopal-reddy Selected by the juries comprising very eminent persons. S R Jindal Prize - Rs.25 lakhs each

{{Infobox artist|image=

For Rural Development & Poverty Alleviation Dr. Ghanta Gopal Reddy Winner of S R Jindal Prize - 2011 for Rural Development And Poverty Alleviation

Dr. G. Gopal Reddy established Mahatama Gandhi Lift Irrigation Society in Gaddipalli village and solved the recurrent drought problem of his village. He provided leadership for this successful effort by securing the cooperation of all the farmers who contributed 10% of their land for common purpose. This scheme benefitted 7700 farmers to irrigate 6600 acres of land. He also motivated the villagers to take up other development works like establishment of a Krishi Vigyan Kendra, establishment of Sri Aurobindo Institute of Rural Development, education and health facilities, self help groups and animal husbandry facilities in the village.

'S R Jindal Prize -- 2011' for 'Rural Development and Poverty Alleviation' with a cash prize of Rs. 25 Lakhs is awarded to Dr. G. Gopal Reddy jointly with Lok Biradari, Prakalp, for his dedicated work for all round development of Gaddipalli Village of Andhra Pradesh.

**Yedavallisreddy/Dr ganta gopal reddy**


డాక్టర్ గంట గోపాల్ రెడ్డికి జిందాల్ అవార్డు

Dr. Ghanta Gopal Reddy Winner of S R Jindal Prize - 2011 for Rural Development And Poverty Alleviation.png

**Yedavallisreddy/Dr ganta gopal reddy**


డాక్టర్ గంట గోపాల్ రెడ్డికి జిందాల్ అవార్డు 1


Dr. Ghanta Gopal Reddy Winner of S R Jindal Prize - 2011 for Rural Development And Poverty Alleviation

**Yedavallisreddy/Dr ganta gopal reddy**



Sitaram jindal foundation award receiving by dr ganta gopal reddy from shree ravi shankarjee art of living

డాక్టర్ గంట గోపాల్ రెడ్డికి జిందాల్ అవార్డు 1]డాక్టర్

## మూలాలు


1. SJF Prize 2011 Being Awarded To "Dr. Ghanta Gopal Reddy" Jointly Winner In The Field Of "Rural Development & Poverty Alleviation": https://www.sitaramjindalfoundation.org/photos.php?id=10

a) DR.GHANTA GOPAL REDDY AWARD VIDEO CLIP: https://archive.org/details/dr.-ghanta-gopal-reddy-award-video-clip

2. https://www.sitaramjindalfoundation.org/uploads/10/488107img_7676.jpg

3. https://archive.org/details/SRIMATHRUKRUPAGADDIPALLIABHYUDAYAMUDR.GANTAGOPALREDDY21

4. https://archive.org/details/SriMathruKrupa_GaddipalliAbhyudayamu_DrGantaGopalreddy

5. https://archive.org/details/s-r-jindal-foundation-awardees-2011-dr-ghanta-gopal-reddy-sitaram-jindal-foundation-news-clips

6. https://archive.org/details/s-r-jindal-foundation-awardees-2011-dr-ghanta-gopal-reddy-sitaram-jindal-foundation

7. Agriculture Scientist Ganta Gopal Reddy Dead: https://archive.org/details/agriculture-scientist-ganta-gopal-reddy-dead

8. Affiliated_colleges_ganta_goapl_reddy_gaddipally: https://skltshu.ac.in/affiliated_colleges_ganta_goapl_reddy_gaddipally.html

9. Dr-ganta-gopal-reddy-face-to-face-video: https://telangana-gundechappudu.blogspot.com/2023/05/drganta-gopal-reddyface-to.html

10. Sitaram-jindal-foundation-honours-27: https://telugudevotionalswaranjali.blogspot.com/2012/03/sitaram-jindal-foundation-honours-27.html

11. Ganta Gopal Reddy Memories In Gaddipally: https://archive.org/details/ganta-gopal-reddy-memories-in-gaddipally

12. DR. GHANTA GOPAL REDDY AWARD VIDEO CLIP: https://archive.org/details/dr.-ghanta-gopal-reddy-award-video-clip

13. Mahatma Gandhi Lift Irrigation Project Gaddipalli DR Ganta Gopal Reddy Search Results: https://archive.org/details/mahatma-gandhi-lift-irrigation-project-gaddipalli-dr-ganta-gopal-reddy-search-results

గంట గోపాల్ రెడ్డికి జిందాల్ అవార్డు.png

14. DR. GANTA GOPAL REDDY HORTICULTURAL POLYTECHNIC, GADDIPALLY, SURYAPET DISTRICT: Link: https://skltshu.ac.in/affiliated_colleges_ganta_goapl_reddy_gaddipally.html

15. DR. GANTA GOPAL REDDY CLIPS FULL LIST LINK: https://archive.org/details/@sudarshan_reddy330/lists/21/dr-ganta-gopal-reddy SEARCH LINKS:

1. https://onlinelibrary.wiley.com/doi/pdf/10.1002/j.1099-162X.1978.tb00487.x;

2. https://www.andhrajyothy.com/2022/telangana/nalgonda/funds-are-watershedsngtstelangana-673815.html;

3. https://krishi.icar.gov.in/ohs-2.3.1/index.php/misearch/results;

4. https://krishikosh.egranth.ac.in/handle/1/71593;

5. https://krishi.icar.gov.in/ohs-2.3.1/index.php/record/view/227576;

6. https://mguniversity.ac.in/web/assets/img/ResearchPublications/2017_Research%20Publications.pdf;

7.https://books.google.co.in/booksid=uDvuqawJDI4C&pg=PA289&lpg=PA289&dq=mahatma+gandhi+lift+irrigation+gaddipalli&source=bl&ots=RHog9RDwj8

8. https://onlinelibrary.wiley.com/doi/abs/10.1002/j.1099-162X.1978.tb00487.x;

9. https://dlc.dlib.indiana.edu/dlc/bitstream/handle/10535/9/workshop_on_cooperatives_in_resource_management.pdf?sequence=1&isAllowed=y;

10. https://www.andhrajyothy.com/2022/telangana/nalgonda/gopal-reddy-the-father-of-modern-agriculturengtstelangana-666352.html;

11. కీ శే డాక్టర్ ఘంటా గోపాల్ రెడ్డివిగ్రహాఆవిష్కరణ# 14 April 2022#శాస్త్రవేత్త : https://archive.org/details/@sudarshan_reddy330/lists/21/dr-ganta-gopal-reddy

12. Gaddipalli వికీ: గడ్డిపల్లె

13. http://wikimapia.org/12975455/Gaddipalli;

---